వివిధోజ్జ్వల మాతృ రూప
శివాకృతులు పల్లితములు శ్రీచక్రములై.

ఈయన భావనలోని భారతీయతా వాదాన్ని స్పృశించడమే కాకుండా, హిందూ సంప్రదాయంలోని మూల్యాలను అందించడానికి ప్రయత్నించడమే కాకుండా పాఠకుని అంతఃస్పృహలోకి చొచ్చుకొని పోతారు.

ఒక కిరణము సూర్యునితో – ఓహో సర్వ తేజస్సు
ప్రకటితమ్ము నావలనన పదిసూర్యులేన–యన్నట్లు
ఒక బిందువంబురాశి యన్న ఊహను పెంచుకొన్నట్లు
ఒక నేను నీవసుట యన్న ఊహలో తప్పేమి కలదు.

(తేజశ్చక్రము పుట–15)

అయన భావుకతను, ఆయన అక్షరాక్షరాలు పదిమందికి స్పృహను, సృజనను అందించాలనే కామన, ధ్యేయం ఇందులో కనబడుతుంది.

తేజశ్చక్రము : తేజశ్చక్రములో రెండు కావ్యాలున్నాయి. ఒకటి తేజశ్చక్రము, మరొకటి దుఃఖయోగిని తేజశ్చక్రములోని పద్యాల సంఖ్య ఒక వంద. మధ్యాక్కరకూ, ప్రస్తుత వచన గేయానికి (1957–58) మధ్యస్థంగా ఉంది ఇందులోని ఛందస్సు. ఛందస్సు ఏదైతేనేంగాని శ్రీ సుప్రసన్నగారు ఊహ విషయంలో పద్యంచేత భరత నాట్యం చేయించగలరు. కమ్మని సంగీతం పాడించగలరు, మనోహరమైన రూప చిత్రాన్ని గీయగలరు.

"ఊహించుటన్నది మనస్సు కొరిగిపోవు లక్షణమ్ము
ఈ హృదయమందది తెగదు, ఎప్పుడు సాగునదియద్ది
ఈహ చుట్టు వేదాదుల ఊహలు భ్రమించి చేదు
ఒహో! చిత్ర మనస్సృష్టి! ఊహసీమకందరావు" (పుట–7)

తేజశ్చక్రము ఆత్మాశ్రయముగా సాగినది. ఇందులోని ప్రతి పద్యం వేదాంత భావనకు లాక్కుపోతుంది. అద్వైతభావనను సమర్థిస్తూ సాగిన కమనీయకావ్యం ఇది.

ఈ పుస్తకంలోని రెండవ కావ్యం 'దుఃఖయోగిని' ఇది శ్రీ సంపత్కుమార గారితో కలిసి రచించినది. ఇది వస్త్వాశ్రయము. ఈ పుస్తకం 3 సర్గలుగా విభజించబడినది. రామాయణంలోని సీతా దుఃఖాన్ని కావ్యంగా చిత్రించారు. సీతాదేవి మహాదుఃఖయోగ సమాధిలో ఉన్నట్లుగా చిత్రించిన ఈ కావ్యంలోని ఊహ క్రొత్తగానూ, మనోహరంగానూ ఉంది. ఈ రచయితల యొక్క స్వతంత్ర భావనాశక్తికి యీ కావ్యం నిదర్శనంగా నిలుస్తుంది. సీతాదేవి దుఃఖయోగినిగా ఆమె తపోముద్రలో ఉన్నట్టు ఎలా చిత్రించారో ఈ పద్యం ఒకటి చూడండి.

> ''ఈతమో సరస్సున నీమె హిమపటలప
> రీత- రెక్కలు ముడిచిన శ్వేత పుండ
> రీక మన్న విధమ్ముగా, వేకుజాము
> రీడ రాంధ్యోత్థ శౌక్రిక రేఖిక వలె" (పుట-28)

'ఋతంబర'లోని కవితలు చేతనావర్తము సంపుటాలలోని రచనలను ఒక దగ్గరకు చేర్చి, ఇంకొన్ని కలిపి ప్రచురించినాడు. ఈ సంపుటిలో "మనోమయకోశంలోని మనుష్యుడు దివ్యత్వాన్ని అధిరోహించడం ప్రతీకాత్మకంగా చెప్పబడ్డది. దీనిలో వేదాంత, తాంత్రిక మనశ్శాస్త్ర విషయాలు సమన్వితిని పొందాయి" (చేతనావర్తం మొదటి సంపుటం) అలాగే ఈ ఖండికలలో సమాజం, మనిషి ఆక్రమించటంతో శైలిలో సరళతను రూపొంది ప్రవహించింది. సమన్వయ దృష్టితో సంకలనం చేసే కవితా సంపుటాలు సంకలన ప్రవృత్తిని కలిగి ఉంటాయి. విభిన్న అంశాలపై అప్పుడప్పుడు వ్రాసిన ఖండకావ్యాలను కలిపి ఒక సంకలనంగా ప్రచురించే పద్ధతిలో కావ్యత్వ స్పృహ ఉండడానికి వీలుండదు కాని వస్తువుచేతగానీ, ఒక దృక్పథం చేతగానీ, ఒక శిల్పంచేతగానీ, ఒక క్రమంలోనిబంధింపబడిన ఖండకావ్య సంకలనాన్ని కావ్య సూత్రచ్ఛాయగల ప్రక్రియగా సంభావించవచ్చును. సుప్రసన్నగారి "ఋతంబర" కూడా ఒక సమన్వయ సూత్రంతో పఠితకు కావ్య స్పృహను కలిగిస్తుంది.

పద్యంలో ఎంతగా పయనిస్తుందో ఈ కలం వచన కవిత్వంలో కూడా సమంగా ప్రయాణం చేస్తుంది. కవి కవికి భావనాపటిమలో భేదం ఉండవచ్చుకాని, అవిష్కారములో తేడా ఉంటుందని అంటారు ఈ ఖండికలో

"ప్రతి ఒక్కడు ఒకదీపశిఖ
ఎవడి మనస్సు వాడికే ఆవిష్కార శాఖ
కాని ఒకటే ప్రాణస్రోతస్సు అంతటికీ
అదే జీవనాధార" (ఋతంబర పుట 16)

అంతేకాదు —

ఒక్కొక్క మాటలో నుంచి
ఒకవేయి మనసుల్ని తీసి
హృదయ దర్పణం ముందు నిలబెడితే
అవరిపోయే అల్పమనస్సుల మధ్య
ఏ ఒక్క సాధు చేతస్సులోనో
ఏ మధుర గీతమో పలుకవచ్చు
ఒక జల సూత్రములా ఆ గీతి
సకల మనోవధుల నదించి
సాగుతున్న ప్రసన్న భావనా సుస్థితి"
(ఋతంబర పుట-16)

ప్రాచీన కావ్యాలను మధించిన ఆయన అంతరంగం, గోపీచంద్ గారు చూపెట్టిన నూతన మార్గము సుప్రసన్న కవితాత్మకు క్రొత్త తొడుగును తొడిగింది. ఆ తొడుగు యొక్క పరిమళం ఎలా పల్లవిస్తుందో ఈ వాక్యాలలో మనం గమనించవచ్చును

"భవిష్యత్సరోవరాలలోకి
భూతకాలపు నదులను మళ్ళించి
వర్తమాన శత పత్ర వల్లికలు వెలయించి
ఎక్కడిదో ఎప్పటిదో తెలియని
అపూర్వమైన
సౌందర్య పరిమళం వీచే చోట
స్వచ్ఛమైన భవభూతికరుణామయ వాగ్వీధి
అక్కడ-
గాలాన తగుల్కొన్న చేపలా
కాలం కదల లేదక్కడ" (ఋతంబర పుట-19)

అనడం వలన కావ్యాలలోని మాధుర్యంను, అందులోని భావనా వీచికలు పాఠకుణ్ని ఎలా తన్మయింప చేస్తాయో ఇందులో చెప్పారు.

తెలుగు కవులలో విమర్శకులు అయిన వారు తక్కువ. వీరిలో భాష్య కారులు చాలా తక్కువ. ఈ కొద్దిమందిలో ఎన్నదగినవారు ఆచార్య కోవెల సుప్రసన్నాచార్యులుగారు. సృజనాత్మక రచనలతో పాటు సప్రమాణం అయిన విమర్శ, నూతనత్వం, సాధికారం నింపుకున్న ఉత్తమ భాష్యం శ్రీ కోవెల సుప్రసన్న గారి కలం నుండి వెలువడిన ఋతుంభర ప్రతి కవితలో తను చెప్పదలచుకున్న విషయాన్ని సూటిగా చెప్పారు. ఈయన ప్రతి కవితలో విమర్శనాత్మకతను కూడా దిఙ్మాత్రంగా చూపెడతారు. సచ్ఛంప్రదాయ చ్ఛందిస్సుల్లో ఆధునికత కోరే నవ్యకవి సుప్రసన్నగారు, మార్పు ఈ విధంగా కూడా వస్తుందని అంటారు.

"స్మశానంలోంచే రానక్కరలేదు మార్పు
సౌందర్య నిరంతరాన్వేషణలోంచి రావచ్చు
సంపూర్ణతకోసం, సమగ్రత కోసం మనం చేసే
తపస్సులోంచి రావచ్చు, రమణీయ ఫలనిశ్చాయకంగా''

(ఋతంభర-ఎదిగిపో-31)

ప్రస్తుత సమాజంలో పేరుకొని పోయిన అవకతవకలను, సమాజం లో ఘోరాలతో కూడుకొని ఉన్న పట్టు తెరలాంటి యవనికను ఇలా ప్రతిబింబింపచేసారు.

"శవగంధం కొడుతున్న ఈ పట్టు తెరని
శుష్క-జాళనానికి పంపించండి"  (ఋతంభర పుట-13)

అని అంటూనే-

''జీవితానికి దుర్వ్యాఖ్య చెయకు
చిక్కని మనస్సుయొక్క అనుభూతిదాచకు'' అని

(ఋతంభర-15)

అనడంతో ఊరుకోకుండా 'మథనం' అనుఖండికలో ఇలా ఆశాభావాన్ని వ్యక్త పరిచారు.

'రావచ్చు చీకట్ల ముసురు
పోవచ్చు వెన్నెలల కిసురు
వెలుగుతుంది మనస్సులో నిత్యమైన
ఆత్మ పరిమళ రూప సౌందర్యరేఖ' (ఋతంబర-65)

ఋతంబర కావ్యం ఎన్నో అనంత సత్యాలను అందించి వాటిని మనకు చాటిచెప్పి ఆయన ఋతంభరుడు అయినారు.

సుప్రసన్న గారి ఇంకొక విలక్షణమైన కావ్యం 'శతాంకుర' 'నీచైర్గచ్ఛత్యుపరిచదశా చక్రనేమిక్రమేణ' అన్న కవికుల గురువు మందాక్రాంతంలోని గురుత్వభావన అమోఘ సందేశం ప్రతి అంకురంతో అభివ్యక్త మవుతున్న నూరు కవితల గ్రంథం శతాంకుర. ప్రతి కవితకు శీర్షికఉండదు. సహస్ర శీర్షములు గల పురుషుడొక్కడే. అలాగే శతాంకురయైన సుప్రసన్న కవిత ఒక్కటే ఏకత్వంలో అనేకత్వం ఇది.

'చైతన్యపు కాగాడాతో నడిచేవాడికి
కాలమంతా వర్తమానమే
గతమూ, ఆగతమూ ఇప్పటి క్షణానికి
మనోద్రవ్యంతో ఏర్పడ్డ నీడలు' (శతాంకుర పుట 36)

శతాంకుర ప్రారంభం కావడమే గమ్మత్తుగా మొదలు అవుతుంది. ఎందుకంటే ఇంతవరకు సుప్రసన్న సాహిత్యం చదివిన వారికి ఇందులో కవిత్వం స్థాయి ఎలా ఉంటుందో అంచనావేసుకొని ప్రారంభిస్తే ఆశ్చర్యపడక తప్పదు. ఆ ఖండిక ఇది.

నా చేతిలోని ఆకాశం జారిపడింది
ముక్కలయింది వేలుగా, లక్షలుగా, కోట్లుగా
ప్రతి ముక్కలోనూ ప్రతిఫలించే ఏదో ఒక నేను
ప్రతిభ-ప్రతిష్ట జగత్తులోవలె
..... .... .... .... ....
ఈ ముక్కలను కరిగించి ఒక ముద్దగా చేస్తే
దానిలో ప్రతి ఫలించే సహస్ర కిరణాలు
ఏ కళా దీపాన్ని వెలిగించేను! [శతాంకుర పుట 17]

అందుకే ఈ శతాంకుర చదివిన డా॥ సి నారాయణరెడ్డిగారు ఒక చోట ఇలా అంటారు. మొదటి కవితలో మొదటి పంక్తే నా భ్రమను విదిలించింది. చదువుతూ పోతుంటే ఈ శైలి, ఇంత సరళ శైలి ఎలా అలవడిందో లోతుల్ని ఎత్తులకెగరేసే గుణం, చిన్న మాటలతో ఆకాశాన్ని అరచేతికందించే లక్షణం ఈ కవితల్లో దాదాపు అంతటా కనిపిస్తుంది. ఈ కవితల్లోని తాత్వికత, పారలౌకిక పరిధులను స్పృశించినట్టు కనిపించినా చుట్టూ ఉన్న పట్టినీ. మనిషినీ పట్టిస్తూనే ఉన్నాయి.

'చుట్టూ మంచు తెరలు క్రమ్ముకొన్న అద్దాల మండపం
నిండుగా వెన్నెల కురిసిన అపార సరోవరం
లేత ఎండల వెల్లవేసిన సితరుచిర సౌధం
వసంతపు అవపాతంలో చిక్కుకున్న అసితైరావతం
ఈ పృథ్వి—
క్షణక్షణమూ కొత్త రూపెత్తే సురసుందరి
కణకణమూ స్పందించే జీవరాజ పేటిక
ఈ పృథ్వి—
చివురించడం, కోరకించడం, ఫలించడం
బాల్యం, యౌవనం, కౌమారం, వార్ధక్యం
జీవితపు అంచుల నడిమి గ్రంథం
అటు పుట్టుకా ఇటు మృత్యువు
ఆ పుస్తకానికి రెండంచులు
ఈ పృథ్విపై జీవించడం ఎంతటి వరం' (శతాంకుర పుట-89)

సుప్రసన్నగారు తమ ప్రతి కావ్యంలో ఎక్కడో ఓ దగ్గర గురువర్యులు శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారిని తలువకమానరు ఈ పుస్తకంలో 89వ పుటలో చూడవచ్చు. అందుకే ఇలా అంటారు

"నా మూలం ఆధారబిందువు
నేను వికసిస్తే వేయంచులగొడుగును"

ఈ కావ్యాన్ని అవలోకించిన శేషేంద్రగారు వారి అనుభూతిని వెలిబుచ్చారు. "శతాంకుర ఆమూలాగ్రం చదివింపచేసింది. శబ్దాలు శక్తి

వంతము లైన ప్రాణు లైనప్పుడు వాటికి ఆ మహిమ వస్తుంది కాబోలు! ఈ మధ్య ఇంద్రియాల్ని ఇంత మోహింపజేసిన కవిత నాశ్రోత్రసీమలో అడుగు పెట్టలేదు. ఇది ఒక సంకలనం కాదు తెలుగు కవితాక్షేత్రంలో ఒక సంచలనం, ఒక సంఘటన. అకలుషిత ప్రసన్న జలధారల్లా ప్రవహిస్తున్నాయి శతాంకుర లోని కవితా పంక్తులు"

ఈ శతాంకుర సరికొత్త భావాంకూ, కొత్త ఉపమలకూ, కొత్త ప్రతీకలకూ, కొత్త కల్పనలకు అలవాలం. పదానికి ఉన్న పరిమితులనూ, అర్థానికి ఉన్న గాంభీర్యాలను తలస్పర్శిగా అవగాహన చేసుకొన్న కవి సుప్రసన్న. ఛందోమర్యాదలను ఎరిగిన కవి ఈయన. అయినా వచనంలో కవితలను వెలయించినాడు. కేవలం ఛందస్సును నిరాకరించినంత మాత్రాన వచనాన్ని ప్రయోగించినంత మాత్రాన, భావం కవిత్వమైపోదు. అవి కేవలం కవితకు కనిపించే పొలిమేరలు. ఆ పొలిమేరల్లోనే ఉత్తమ కవితలను అందించ వచ్చునన్న అభిప్రాయం పూర్తిగా కాదనడానికే సుప్రసన్నగారు ఈ శతాంకు రను అవిష్కరణచేసారనడంలో ఏమాత్రం అతిశయోక్తి లేదు. డా॥ ఇరివెంటి కృష్ణమూర్తిగారన్నట్లుగా యతులకోసం తడుముకోకుండా, ప్రాసల కోసం పాకులాడకుండా, దైనందిన జీవితంలో పెనవేసుకునే భాషలో, స్వీయానభూ తులను పొదగడమే వచన కవితకు ముఖ్య లక్షణం. మనస్వి అయిన వానికే ఇది సాధ్యం, తపస్వి అయినవానికే ఇది సాధ్యం. వ్యుత్పన్నత ఉన్నవానికే ఇది సాధ్యం. సహజమైన ప్రతిభ ఉన్న వారికే ఇది సాధ్యం, నూరుకవితలు నూరు అంకురాలు. నూరు ప్రరోహాలు, అభివ్యక్తిలో నూత్నత శ్రీ సుప్రసన్న ప్రత్యేకత"

వస్తువుతో సంపదించకుండా రూపం ఎలా ఉంటుందో తెలిపేదే వచన కవితా విభాగంలో వచ్చిన ఆధ్యాత్మిక కావ్యాలు. ఈ అంశంలో జరిగిన జరుగుతున్న - అంతరగతి తర్కాన్ని నిరూపిస్తుంది. మొత్తం ఆధ్యాత్మిక వస్తువులోనే రాయబడిన కవితా సంకలనము సుప్రసన్న గారి శతాంకుర ఇందులో ఆధ్యాత్మిక భూమిక బాగా పరిణత పొందినది.

ఆధ్యాత్మిక వస్తువుకు నేటి కవులు కల్పించిన సౌకర్యం ఒకటి ఉంది. ఆ సౌకర్యంను సుప్రసన్నగారు శతాంకురలో విరివిగా కల్పించారు. అది 'కవిత్వం యెప్పుడూ వాడుక భాష నించి జీవం పుంజుకొని తిరిగి అదే భాషకి

పునరుజ్జీవం కలిగిస్తుంది" (సాహసి—వజీర్ రహ్మాన్ పుట-91) అంటే భాషలో సారళ్యం, వచన రూపం వల్ల అన్వయంలో సౌలభ్యం అన్న రెంటినీ ఈ కవులు సాధించారు. ఈ సాధన శతాంకురలో మనకు కనబడుతుంది. ఏ అభివ్యక్తికైనా కవులకు వచనంలో ఎంతో సౌకర్యం ఉంటుంది. కేవలం భావాభివ్యక్తి వల్ల కలిగే సౌందర్యంతోనే వచన కవితకు ప్రాణ ప్రతిష్ఠ జరుగుతుంది. కాబట్టి కవికి ఈ మార్గంలో ఛందస్సుల అడ్డంకి ఉండదు కాని కవి దృక్కోణం నుండి వచన కవితా మార్గమే ఎక్కువ సౌకర్యం. ఛందస్సు మీద అధికారాన్ని సాధించడానికి కవి చేసే ప్రయత్నం ఈ మార్గంలో అవసరంలేదు కాబట్టి, ఆ శక్తినంతా అభివ్యక్తిలో నవ్యత, గాఢతలకు కవి మళ్ళించుకోగల్గుతాడు. సుప్రసన్న ఋతంభర, శతాంకురల్లో ఇది మనకు స్పష్టంగా కనిపిస్తుంది. ఆధునిక కవిత్వానికి ప్రాణం పోస్తున్న ముఖ్య కవితా సాధనాలు భావచిత్రాలు, ప్రతీకలు. ఈ భావ చిత్రాలు, ప్రతీకలు 'శతాంకుర'లో ప్రతిబింబించి వచన కవితా మార్గంలో ఆధ్యాత్మిక వస్తువుకు విశిష్ట స్థానాన్ని కలిగిస్తున్నాయి. అందుకే శ్రీ సుప్రసన్నగారి శైలి 'ప్రతీకాత్మక శైలి' అని శ్రీ జి.వి. సుబ్రహ్మణ్యం గారు అంటారు. అంతేకాదు "కవితా రూపాన్ని కూడా వివిధ వస్తువులకు పనికి వచ్చేటట్లుగా మలచుకోవడంలో కవి ప్రతిభ వినియోగం కావాలి. ఈ విషయంలో 1961లో చలంతో ప్రారంభమైన కృషి 1987లో సుప్రసన్నగారి శతాంకురతో సమగ్ర స్వరూపాన్ని పొందిందని చెప్పవచ్చును. చలం ఆలోచన నుండి అనుభవానికి చేరాడు. సుప్రసన్న అనుభవాన్ని ఆలోచనగా ఆవిష్కరించారు, ఇవి ఒక తొడిమకు పూసిన రెండు పూలు అన్న జి.వి. సుబ్రహ్మణ్యంగారి అభిప్రాయం 1961 నుండి 1987 వరకు వచన కవితా మార్గంలో వచ్చిన ఆధ్యాత్మిక వస్తువు యొక్క సత్పరిమాణాన్ని తెలుపుతుంది.

మహాపురుషులు చూపిన మార్గంలో జీవితాన్ని నడుపుకుం
కేవలం వారి ప్రబోధాలను కవిత్వ భాషలో రాయడమే కాకుండా, మానవ
నడుమన ఉండే ఏకాత్మతను అనుభవించి ఆ అనుభూతిని కవిత్వీకరించడమ
ఈ ఆధ్యాత్మిక కావ్యాలలో కనిపిస్తుంది. అసలు ఆధ్యాత్మిక కావ్యాలలో ప్రధానంగా కనిపించాల్సింది ఇదేనన్నా తప్పులేదు.

సుప్రసన్నగారు ఏకాత్మతాభావాన్ని సుందరంగా అభివ్యక్తీకరించినారు. వచన కవిత్వమార్గంతో ఆధ్యాత్మిక కావ్యశాఖ వచ్చి బలపడి ఈ కవితా రూపంలోని వస్తు పరిధిని విస్తృత పరిచింది.

శ్రీ సుప్రసన్నగారి సాహిత్యానికి భూమిక భారతీయ దర్శనం, భారతీయమైన మూల్యాలు భూమికగా ఆయన సాహిత్యను అధ్యయనం చేయ వలసిన అవసరం ఎంతైనా ఉంది. వివేకానందుల, విశ్వనాథ, అరవిందులు, శ్రీమాత, జిడ్డు కృష్ణమూర్తి, రమణ మహర్షిల యొక్క రచనల ప్రభావం ఆయన జీవిత సాహిత్యాలపై అపారమైన ప్రభావం చూపెట్టినట్లుగా గమనించ వచ్చును ఆయన రచనల్లో.

## హృద్గీత :

ఈ శతకమును 1954లో వెలువరించారు శ్రీ సంపత్కుమారా చార్యులుగారితో కలిసి ఈ శతకములోని వృత్తాలన్నీ శార్దూల మత్తేభాలు, ప్రతి వృత్తంలోను శార్దూలలంగనోపద్ధతికాని, మత్తేభగమన గాంభీర్యం కాని గోచరిస్తుంది. ఈ కృతిలో గమనించదగినది సమాన సంఘటనము, వాక్యగత మైన కాకువులు శిల్ప ప్రయోజనాన్ని అర్థించి శబ్దప్రయోగములలో రచయితలు అనుసరించిన స్వాతంత్ర్యము మెచ్చదగినది, ఇందులో సమాన పదగుంభన లతో పాటుగా స్వభావోక్తులతో జాతీయత ఉట్టిపడే పద్యాలు కూడా ఉన్నాయి.

"ఒక్కొక్కప్పుడు నీవు లేవనుచు నేనున్నావటం తెంచెదన్
ఒక్కొక్కప్పుడు నేను లేవనుచు నీవున్నావటం చెంచెదన్
ఒక్కొక్కప్పుడు నీవు నేనొకటియే యోగంబటం చెంచెదన్
ఒక్కొక్కప్పుడు తండ్రి బిడ్డల మటంచూహింతు సర్వేశ్వరా!"

(పుట 4–18వ పద్యం)

ఈ శతకం "సర్వేశ్వరా" అనుమకుటంతో సాగింది.

## ఆనందలహరి :

ఈ కృతికూడా సంపత్కుమార గారితో కలిసి రచించినిదే. ఈకావ్యానికి కథా బీజం రామాయణంలోని అరణ్యకాండలోని 74వ సర్గలోని శబరి వృత్తాంతంను 'ఆనందలహరి'గా మలచారు. ఈ ఆనందలహరిలో విశ్వనాథ రచనామార్గాన్ని అనుసరించి పద్యపచన జరిగింది. విశ్వనాథ వారి ప్రౌఢిమ ఇందులో ద్యోతకం అవుతుంది. ఇది 5 ప్రకరణములుగా సాగిన లఘుకృతి.

'గుండెల చిచ్చులన్ బరచకొన్న విధమ్ముగ జీవితమ్ము నీ
కుండెను దీనికారణమహో! యొక 'నేన'నునట్టి యూహ, లే
యెండల మంచుబిందువు లయించిన యట్టులు స్వామి చింతయే
గుండెలలో సుధాధునులు కూర్చును, చేతము శాంతినందెడున్'

ఈ కృతి విశ్వనాథవారికి అంకితం ఇచ్చారు.

## పాండిచ్చేరి పన్నెండు గీతాలు

1974 సంవత్సరంలో పాండిచ్చేరికి వెళ్ళడం, అక్కడ ఆశ్రమంలో పొందిన తాదాత్మ్యత, అంతవరకు మనస్సులో రగిలిస్తున్న అరవిందుల సమాలోచనం ఉవ్వెత్తున పొంగి కెరటంలా 'పాండిచ్చేరి పన్నెండు గీతాలు' అవతరించింది. ఈ గీతాలను ఆచార్య యస్. లక్ష్మణమూర్తిగారు ఆంగ్లంలోకి అనువదించారు.

## పాంచాలరాయ శతకము :

వరంగల్లుకు 10,12 కి.మీ. దూరంలో హవేలీ శాయంపేటకు వెళ్ళడం, అక్కడగల పాంచాలరాయస్వామిని దర్శించుకోవడం ఆ అనుభూతి, తాదాత్మ్యతకు నిదర్శనంగా "శ్రీ పాంచాలరాయ శతకం"ను రచించినారు 1975 సం॥లో. ఇది విశిష్టాద్వైతంతో కూడుకొనినది. ఈ శతకం వచనంగానూ, పద్యంగానూ నడిచే ఛందస్సు. మధ్యాక్కరలో రాసిన ఈ శతకములో ఇంద్రగణాల స్థానంలో అక్కడక్కడ భలము, నలలము వాడటం జరిగింది.

యతి లాక్షణిక సంప్రదాయాన్ని బట్టి చతుర్థ గణాదియందే ఉపయోగింపబడిన దిందులో.

## స్తుతి ప్రబంధము

ఇందులో దేవీపూజ, అగ్నిసూక్తము, శ్రీలక్ష్మినృసింహోదాహరణములను కలిపి 1988 డిసెంబరులో స్తుతి ప్రబంధముగా ప్రచురించినారు. ఇందులోని "శ్రీ లక్ష్మీనృసింహోదాహరణము"లలో ఆంధ్రప్రదేశ్‌లోగల పలు నరసింహమూర్తులను దర్శింప చేసినారు. అగ్నిసూక్తం చాలా గొప్పగా ఉంది.

ముయ్యేడు మార్లు మ్రొక్కెద
నయ్యా సప్త స్వరముల వ్యాహృతులను అ
క్రయ్య ములు పద్మ మాలల
నెయ్యము నిల్పవె సమర్పనీయుడ నీవై

(పుట 5 అగ్నిసూక్తం)

ఉదాహరణములలో విభక్తి వాచకములను వాడినారు.

శ్రీ సుప్రసన్నగారి ఊహ ఎంత నవ్యంగా నడుస్తుందో మరొక మారు గమనించ వచ్చు అది ఏ కావ్యమైనా, ఏ ఖండికైనా

"మేము వచ్చేడి దారినెల్లమీ వాడు తొలివాగురేడు
తామల్పుగా గిరి చుట్టు దారిగా చుట్టుకొన్నాడో!
అమె పద్మావతి, కొంగులంచుల సొగసుల కొసల
కో ముడి విన్వైచికొన్నదో యేమొ పారిపోకుండ
సామదుగ్గావ మూర్తి నిను సంయమిచిత్తాబ్జవర్తి!"

(కృపారేఖ పుట 36)

## సాహిత్య వివేచన

ఈ గ్రంథంలోని వ్యాసాలు అన్నీ 1968-71లలో వ్రాసినవి. ఈ గ్రంథానికి 1972 సం॥లో ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీ అవార్డును

ఉత్తమ విమర్శా గ్రంథంగా బహుమతి పురస్కారం చేసారు. ఇందులో వ్యాసాలు రాస్తున్నకాలంనకు ముందు గల 1949 తరువాత తెలుగు కవిత్వం లోకంలోని వివిధ పరిణామ దశలనూ అంతర్లీనముగా సూచించారు.

## సహృదయ చక్రము

14 వ్యాసాల సంపుటి సహృదయ చక్రము. ఇందులోని వ్యాసాలను పరికించాక ప్రసన్న హృదయం. సహృదయంగాను, ఆలోచనామృత రసపరిప్లుతం. అదే ప్రసన్న రచనా రస సరస్వతికి కోవెల. ఆ కోవెలలలోని షోడశకళాన్యాస వ్యాసమూర్తులలో గరుడాళ్వారు, హరిహర మూర్తి, రామాయణ తారావళి, కల్పవృక్షం, ఏయిపడగలు, రుక్మిణీ కళ్యాణము చోటు చేసుకొనటంతో ద్వైతాద్వైతసమాహారం ప్రశంసా పాత్రంగా ఉంది. ద్వైతంలో అద్వైతం అందుకొన జేసిన వీరి విశిష్టాద్వైత పరిజ్ఞానానికి జోహారులు చేయక తప్పదు

శ్రీ ప్రసన్నగారుపై గ్రంథాలు మాత్రమే కాకుండా ఆయనవద్దగర అముద్రితంగా నాలుగైదు వ్యాస సంపుటాలుగా రావడానికి సరిపడేన్ని వ్యాసాలు 'కన్నీటుకొలను' కవితా సంపుటి, 'శ్రీనిరుక్తి' అష్టోత్తర శతనామావళినను సరించి ఒక్కొక్క నామానికి ఒక్కొక్క పద్యం చొప్పున వ్రాసినవి, ఇతర కావ్య ఖండికలు కూడా ఉన్నాయి.

వీరిపై శ్రీ విశ్వనాథ సత్యనారాయణ, విశ్వనాథ వెంకటేశ్వర్లు గారి ప్రభావము ప్రగాఢమైనది. ఒక విధముగా వీరిరువురిపైన గురుభావము కూడ కలవారు. విశ్వనాథ వారి పైనున్న గాఢానురక్తికి నిదర్శనంగా వీరి మొదటి కావ్యంనుండి శతాంకర వరకు వచ్చినవాటిలో ఎక్కడో ఒకచోట వారిని పేర్కొనకపోరు. శైలిలో ప్రత్యేక ముద్ర యేర్పడినది. ఈనాటికీ 1954లో రచించిన మొదటి కావ్యం నుండి ఈ నాటి రచన వరకు వారికి కంఠతా ఉంటుంది. ఆయన గళ స్వరంలో ఆ అక్షరాల ఝరులు ప్రతిధ్వనిస్తూనే ఉంటాయి. ఇందుకు వీరి అవధానధారణ కూడా కొంత కారణం కావచ్చును.

సూర్య తేజస్సును కొలవడానికి మిణుగురుకు చాతనవుతుందా? ఇది వారి రేఖా చిత్రంను చిత్రించే ప్రయత్నం మాత్రమే కాని సమగ్ర చిత్రీకరణ మాత్రం కాదు ఇసుమంతైనా చెప్పానని సహృదయులు భావిస్తే అదే పదివేలు.

సృజనాత్మక రచనలతో పాటుగా సప్రమాణం అయిన విమర్శ నూతనత్వం సాధికారం నింపుకున్న ఉత్తమ భాష్యం శ్రీమాన్ కోవెల సుప్రసన్నాచార్యులు గారి కలం నుండి నవోన్మేషంగా జాలు వారుతుంది.

## వ్యాసాలు

| | | |
|---|---|---|
| 1. | తెలుగులో ప్రత్యేక కావ్యం—ఉదాహరణ | గోలకొండ పత్రిక 5/54 |
| 2. | ఎంకి పాటలు—విభిన్న కోణాలు; నాలుగు వ్యాసాలు | స్రవంతి 10/55 |
| 3. | నా దృష్టిలో కథారచన | తెలుగుదేశం 1/56 |
| 4. | ఓరుగల్లు సాహిత్య సమీక్ష | ఆంధ్రప్రదేశ్ అవతరణ సంచిక, వరంగల్లు 11/56 |
| 5. | కాళోజీ నా గొడవ | స్రవంతి 12/56 |
| 6. | నేటి సాహిత్యము (దేశోద్ధారకస్మారకోపన్యాసం) | ప్రభాత 1957 |
| 7. | ఆత్మవేదన—పొట్లపల్లి రామారావు | స్రవంతి |
| 8. | ? | జయంతి 8/59 |
| 9. | ఈ దశాబ్దపు తెలుగు కవిత | స్రవంతి 1966 |
| 10. | కవివాదులు (శంయ్యాల లక్ష్మీనృసింహాచార్యులు) | ఆం.ప్రదేశ్ 9/60 |
| 11. | రామాయణతారావళి | ఆంధ్రప్రభ, విజయవాడ |
| 12. | నేటి కవిత సంప్రదాయము | జయంతి |
| 13. | వచన పద్యం | జయంతి |
| 14. | శ్రవ్య కావ్యేతి వృత్తము | భారతి 5/61 |
| 15. | కృష్ణయజ్వని అలంకారముక్తావళి | ఆంధ్రప్రదేశ్ |
| 16. | మహాకావ్యము—మహాప్రబంధము | ఆంధ్రప్రదేశ్ 9/62 |
| 17. | హరిహరనాద తత్త్వము | కృష్ణాపత్రిక 8/64 |
| 18. | విశ్వనాథ హరిహరిహరాద్వైతము | జనధర్మ ప్రత్యేక సంచిక 11/65 |

19. మహాకావ్యగుణములు — జ్యోతి, వరంగల్లు 1965
20. తెలుగు విమర్శ–విశ్వనాథ పాత్ర — సప్తతి నీరాజనము
21. ఆముక్తమాల్యద కావ్య శిల్పము — సాహితీవాల్లభ్యము 1967
22. శ్రీకృష్ణదేవుని నిర్వేదము — జనధర్మవారపత్రిక 1967
23. కాలాతీతవ్యక్తులు — జనధర్మ 1967
24. నరేంద్రుడు — జనధర్మ 1967
25. నగరంలో వాన — జనధర్మ 1/1968
26. రాయప్రోలువారి అమలిన శృంగారం — జనధర్మ 1968
27. జీవనగీత–కాళోజి — జనధర్మ 1968
28. కోవంగి — జనధర్మ 1968
29. స్వర్ణహంస — జనధర్మ 1968
30. వచన కవిత–కథాకావ్యం — ఫ్రీవర్స్‌ఫ్రంట్
31. వచన పద్యం ఒక జిజ్ఞాస — జనధర్మవారపత్రిక 11/88
32. అముద్రిత కావ్యము తాత్త్విక దృష్టి — జనధర్మ 1/69
33. వెలుగులో కొన్ని ఆధునిక నవలలు — మాధ్యమ్ అలహాబాదు
సమ్‌రీసెంట్ నావల్స్ ఇన్ తెలుగు — హిందీలో 1969
34. ఎవడు సహృదయుడు — జనధర్మ ద్వైమాసిక 3/69
35. పొరపాటే తిరుగుబాటు — ” ” 7/69
36 ప్రగతి వాద కవిత దాని పరిణామము — ” ” 11/69
37. నవకవిత–తత్త్వదర్శనము — ” ”
38. అభ్యుదయ కవిత్వం తర్వాత — ఆధునిక సాహిత్యంపై సెమినార్
39. సాహిత్యం–జాతీయీకరణ — యువభారతి
40. కల్పవృక్షం–ఆధునికేతిహాసం — జనధర్మ ద్వైమాసిక 7/71
41. ఉల్లేఖనీయ ప్రకాశం (హిందీ) — ప్రకర 7/71
42. నేటి కవిత అంతర్ముఖీనత — సాహిత్య వివేచన
44. వచన కవిత — మహతి, యువభారతి 1973
45. నవ్య కవిత్వారంభం — విమర్శిని–1-1976
46. ఆధునిక తెలుగు విమర్శ — జాగృతి దీపావళి సంచిక 76

47. దేవీతత్త్వం జాగృతి 10/77

48. మహాగ్రంథాలు-సహృదయ చక్రం జాగృతి దీపావళి సంచిక 76

49. మన నవల అతీత, వర్తమాన భవిష్యత్తులు మననవల పరిశీలన 78

49. పేయిపడగలు ఆధ్యాత్మిక భావ భూమిక విమర్శిని-3/1979

50. 70వ దశకంలో తెలుగు కవిత మూసీ 8/80

52. చివరకు మిగిలేది-అదృశ్య కేంద్రబిందువు సాధన 1981

53. రాయప్రోలువారితో ముఖాముఖి సాధన 7/81

54. సంక్షుబ్ధ వర్తమానకలో-భారతీయ సంస్కృతి 20-6-82
- జాతీయ సాహిత్య పరిషత్తు, అధ్యయ వేదిక వరంగల్లు

55. వర్తమాన కవిత్వ దర్శనము - అభ్యుదయ కవిత్వానంతర ధోరణులు
1990

56. సాహిత్యం యుగ విభజన - దానిపరిమితి 16-2-90

57. తెలుగు నవల సంప్రదాయ చైతన్యము- 2-2-86

58 సాహిత్య అనుశీలనలో ప్రాగ్రూపాల పురాగాధల ప్రాధాన్యము
4-8-85 & 11-8-85 ఆంధ్రప్రభ

59. తిరుపతివేంకటకవుల బుద్ధ చరిత్రము 19-1-91 AIR వరంగల్

60. తెలుగులో స్మృతి కావ్యాలు 26-10-90
(నాయని సుబ్బారావు స్మారకోపన్యాసం)

61. ప్రాబ్లమ్స్ అవ్ ట్రాన్స్‌లేటింగ్ సంస్కృతీ, డ్రామాస్ ఇన్ టు తెలుగు

62. ద్రావిడ భాషాధ్యయనం-అధ్యక్షోపన్యాసం -
ఓరియంటల్ కాన్ఫరెన్స్ 10/86 కలకత్తా

63. జీవాస్ పేదన యాజ్ కావ్యహేతు

64. నేటి సమాజ సమస్యలు తత్కారణాలు

65. ది ఇంపాక్ట్ అవ్ అండాళ్స్ పోయెమ్స్ అన్ తెలుగు 14-8-83
లిటరేచర్ అండ్ ఆర్ట్స్ శ్రీవిల్లిపుత్తూరు సెమినార్

66. మతతాత్త్విక సాంస్కృతికోద్యమములు జనవరి 1985

67. తెలుగులో తులనాత్మక పరిశోధన
-కార్లపాటి శ్రీరామమూర్తి షష్టిపూర్తి సంచిక

68. గరుడోపాఖ్యాన ఇన్ మహాభారత

69. ఈస్థెటిక్ అస్సెస్‌మెంట్ ఆఫ్ యక్షగాన మదురై సెమినార్ 2/90

70. కవిత్వము–సృజనమూలాలు– దోణప్ప షష్టిపూర్తి సంచిక

71. శ్రీ అరవిందులు–సావిత్రి – 15-8-90 ఎఐఆర్ వరంగల్లు

72. నవ్య సంప్రదాయంలోని చారిత్రిక కావ్యాలు– 1989

73. ఆధునిక కవితలో సమన్వయం కోసం పరిపూర్ణత కోసం–అన్వేషణ
4-11-87 తిరుపతి సెమినార్

74. కవిత్వంలో అనుభూతి

75. నల్లాన్ చక్రవర్తుల రఘునాథాచార్యులు 'తెలుగు వెలుగులు'
ఆంధ్రప్రభ

76. ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రితో ముఖాముఖి

77. గురువును మించినది ఆత్మాన్వేషణ (శ్రీ జిడ్డుకృష్ణమూర్తి ఉపదేశం
నకు వ్యాస రూపం) 9-2-86 ఆంధ్రపత్రిక,

78. కథానిక ఇతివృత్తము

79. అన్నమయ్య కవితా సౌందర్యము స్రవంతి 1/89

80. విశ్వనాథ రచనలలో కారుణ్య రసమూలాలు 5-10-8[illegible] ఆంధ్రప్రభ

81. కాళిదాసుపై భాసుని ప్రభావం 19-1-86 ఆంధ్రప్రభ
వివేచన Vol. XIV (89-90) ఉస్మానియా సెమినార్ 1990

82. విశ్వనాథ – విమర్శ

83. విశ్వనాథ వాఙ్మయాధ్యయనం సమన్విత దృక్పథం 27-12-88

84. ఆధునికత ఒక వివేచన

85. తెలుగు పద్యం

86. మహా కావ్య గుణములు

87. సంస్కృత రూపకాల అనువాదం జయంతి 22-11-58

88. కవితాశరథి దాశరథి (చైతన్య కవిత–5) విభవవసంతం

89. దాశరథి పద్యం స్రవంతి 11/88

90. విశ్వనాథ సాహిత్య సాధన 1971 నటరాజ కళానికేతన్
ప్రత్యేక సంచిక

91. తెలుగు కోట_ఒక పరిశీలన
రాయప్రోలు సాహిత్య సౌందర్య సందర్శనం వంశీ ప్రచురణ 1980

92. రాష్ట్రారి భరద్వాజ "జీవన సమరం" భరద్వాజ భారతం 1983

93. దాశరథి వ్యక్తిత్వం కాంతి కవాటం దాశరథి 1975

94. వాలోని నాదాలు అడుగు జాడలు 1976
(కుందుర్తి కృతులుపై సమీక్షా వ్యాస సంకలనం)

95. గురజాడ నిజమైన చైతన్యం సాధన 1981

96. వసుచరిత్ర వైభవము రామరాజభూషణుని పీఠం భీమవరం

97. హైందవారాధనా విధులలో ముద్రల ప్రాధాన్యము-
కైలాస దర్శనం అనుబంధం_6 1986

98. విశ్వనాథ సాహిత్యాధ్యయన నేపథ్యం- విశ్వనాథ సాహిత్య
వ్యక్తిత్వం తెలుగు అకాడమి 1989

99. కావ్యాలలో హిమాలయ సౌందర్యము "కైలాస దర్శనం"
అనుబంధం_2 1986

100. మన నడుమ మహనీయులు_పాములపర్తి సదాశివరావు
శక్తిబిందు 26-1-86

101. వ్యక్తివికాసం_20వ శతాబ్దపు ఆలోచనలు
సమాలోచన విజయవాడ (ప్రారంభోపన్యాసం) 30-3-91

102. అనుబంధాలకు అతీతంగా నేను-(శ్రీజిడ్డు కృష్ణమూర్తి తాత్విక చింతన)
ఆకాశవాణి వరంగల్లు 11-5-91

103. వేంకట పార్వతీశ్వరకవులు _ ఏకాంత సేవ
ఆకాశవాణి వరంగల్లు 7/91

## సమీక్షలు

1. సుప్రసన్న సాహిత్య వివేచన సన్నిధానం ఆంధ్రభూమి 12-9-71

2. లిటరరీ ట్రెండ్స్ ఇండియన్ ఎక్స్ ప్రెస్ 16-10-71

3. ఫిలాసఫీ వడదెబ్బకు తట్టుకోగలిగితే _ శతాంకురాల మృదుస్పర్శకు
పులకరించవచ్చు. చేరాతలు - ఆంధ్రజ్యోతి

4. మధనంలోనే సుప్రసన్నత–అవిష్కృతమయే "శతాంకుర"
సి.రా. (సి. రాఘవాచారి) విశాలాంధ్ర 10–4–88

5. ఆనందలహరి–జయంతి కుమారస్వామి — ఆంధ్రపత్రిక 9-12-56

6. హృద్గీత — కృష్ణా పత్రిక

7. హృద్గీత — తెలుగు స్వతంత్ర 5-8-55

8. ఆనందలహరి — తెలుగు స్వతంత్ర 1-6-56

9. తేజశ్చక్రము - కుందుర్తి — నవోదయ 15-10-59

10. అధునా — స్రవంతి

11. కొందరు మానవతా కవులు – "శతాంకుర"
ముదిగొండ వీరభద్రయ్య 19[illegible]8

## నాటికలు – నాటకాలు

1. అంగద విజయం
2. శుక్తిమతి — రేడియో ప్రసారం
3. సౌభద్రుని యాత్ర — "
4. తెలుగు ఋతువులు — " — 23-9-61
5. అన్నదమ్ములు — "

## కథలు

1. పలికించెడివాడు — ఆంధ్రపత్రిక 17-3-82

## కృతులు – కృతిపతులు

1. హృద్గీత — కోయిల్‌కందాడై రంగాచార్యులు
2. ఆనందలహరి — విశ్వనాథ సత్యనారాయణ
3. తేజశ్చక్రము — శ్రీమతి లక్ష్మీనర్సమ్మ (రచయిత తల్లి)

4. అధునా — గోపీచంద్
5. ఋతంభర — శ్రీభాష్యం విజయసారథి
6. పాండిచ్చేరి పన్నెండు గీతాలు — శ్రీమాత
7. పాంచాల రాయశతకము
8. శతాంకుర — శ్రీమతి శారద (రచయిత సహచరి)
9. సాహిత్య వివేచన
10. సహృదయ చక్రము — కె.కె. రామానుజాచార్యులు
11. స్తుతి ప్రబంధము — కందుకూరి శివానందమూర్తి

## సంపాదకత్వం వహించిన గ్రంథాలు

1. వసు చరిత్ర – 1967
2. చేతనావర్తం - 1 – 1967
3 అగ్నిగర్భ – 1974
4. హిరణ్యగర్భ – 1983
5. విశ్వనాథ వాఙ్మయ సూచిక – 1976
6. దూపాటి వెంకటరమణాచార్యుల జీవిత చరిత్రము – 1987
7 వసుచరిత్ర వైభవము – 1990
8. విశ్వనాథ – [సహసంపాదకత్వం]

## పీఠికలు - అభిప్రాయాలు - ఆశీస్సులు

1. వసు చరిత్ర – ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ 1967
2. చేతనావర్తం – మొదటి సంపుటం సాహితీబంధుబృందం, వరంగల్లు 1967
3. తిరునామములు – డా॥ కిడాంబి నరసింహాచార్యులు 1981
4. అగ్నిగర్భ – జాతీయ సాహిత్య పరిషత్తు 1975
5. ప్రభవ – శ్రీలేఖ సాహితి, వరంగల్లు 1987

6. వరంగల్లు జిల్లా రచయితల వాఙ్మయ జీవిత సూచిక – టి. శ్రీరంగస్వామి 1987

7. నాయని సుబ్బారావు కృతులు–పరిశీలన – డా॥ అనుమాండ్ల భూమయ్య 1981

8. కొరవి గోపరాజు–సాహిత్య విశ్లేషణ – డా॥ అనుమాండ్ల భూమయ్య 1983

9. వేయిపడగలు ఆధునిక ఇతిహాసం – డా॥ అనుమాండ్ల భూమయ్య 1984

10. హంస వింశతి విజ్ఞాన సర్వస్వము – డా॥ వెంకటరత్నం 1990

11. వినగదప్ప వెట్టి వెంగళప్ప – వల్లా రామకోటార్య 1967

12. విశ్వనాథ నవలల్లో స్త్రీ పాత్రలు – శరావతి

13. దాశరథి కవిత్వ హృదయం – చందూరి హైమావతి 1987

14. నాటకరంగం సెమినార్ – సి.కె.యం. కళాశాల

15. కైలాస దర్శనం – పి.వి. మనోహరరావు 1986

16. గిడుగు రామమూర్తి విమర్శనాత్మక పరిశీలన – డా॥ వి. జానకి 1991

17. పుట్టపర్తి నారాయణాచార్యులు – డా॥ వి. రంగాచార్య 1991

18. భగవాన్ శ్రీ కృష్ణగురువాయూరప్పన్ – డా॥ ఎ. వై. నారాయణాచార్య 1984

19. విశ్వనాథ ఆర్థిక వ్యవస్థ – డా॥ కె.వి.ఎన్. రాఘవన్ 1990

20. నా జీవిత సాహిత్యం – కె.టి.యల్. నరసింహాచార్యులు శ్రీ గోదా గ్రంథమాల, ముసునూరు 1987

21. రాయప్రోలు సౌందర్య దర్శనం – డా॥ కె. యాదగిరి 1989

22. మాలపల్లి విమర్శనాత్మక పరిశీలన – డా॥ సముద్రాల కృష్ణమాచార్య 1990

23. వందేమాతరం – ముదిగొండ వీరభద్రమూర్తి 1977

24. శ్రీ రామానుజ రామాయణము – శ్రీ మచ్చీరంగం నల్లాన్ చక్రవర్తి రామానుజాచార్యులు 1984

25. శ్రీ రాధికా మనోహరీయ ప్రబంధము –
శ్రీ వల్లదీగ శ్రీనివాసాచార్యులు 1986
[ఇందిరాల, భువనగిరి, నల్లగొండ]

26. ఉదాహరణ (సంస్కృతం) - శ్రీ భాష్యం విజయ సారథి
(ఆంగ్లంలో భూమిక) 1963

27. శ్రీ యాదగిరి లక్ష్మీనరసింహ స్తుతి రత్నమాలా గద్య ప్రబంధాళ్ళ –
శ్రీ వల్లదీగ శ్రీనివాసాచార్యులు 1990

28. శ్రీ యాదగిరి లక్ష్మీనరసింహ ప్రభుస్తుతి పైజయన్తి (ద్వితీయ భాగం)
శ్రీ వల్లదీగ శ్రీనివాసాచార్యులు 5/1990

29. యువతీ శతకము - మంథెన ఆండాళు 1991

30. విరహ గోపికము - మంథెన ఆండాళు 1991

## క వి త లు

| | | |
|---|---|---|
| 1. | పుణ్యభూమి | స్రవంతి |
| 2. | పొలిమేర | జాగృతి 24-1-78 |
| 3. | అగ్నయేస్వాహ | ఆంధ్రపత్రిక |
| 4. | తూర్పుదిశను చీల్చి వచ్చే కిరణం | |
| 5. | రెండు గీతాలు | నేత |
| 6. | సాక్షాత్కృతి | స్రవంతి 3/57 |
| 7. | ఉగాదిపాట | ఆంధ్రజ్యోతి వార పత్రిక 21-3-69 |
| 8. | దీపారోపణము | తెలుగు దేశం 3/56 |
| 9. | అమ్మ | స్రవంతి 3/56 |
| 10. | ఇట్లు కట్టి చూడు | ఆంధ్రప్రదేశ్ 12/59 |
| 11. | మనసుతల్పులు తెఱచి | కాంగ్రెస్ 25-1-65 |
| 12. | ఎవరెస్టు | స్రవంతి 8/55 |
| 13. | భావస్థిరాశి | స్రవంతి/AIR 3/59 |
| 14. | గోదావరి | శోభ 1955-56 |

15. రససిర్ధోహరణము — సారస్వతజ్యోతి 15-8-54

16. జీవితాంతము — ఆర్ట్స్ & సైన్స్ కళాశాల వరంగల్లు వార్షిక సంచిక 1965-66

17. కైవల్యం

18. మూడు గీతాలు — జనధర్మ ప్లవంగ ఉగాది

19. ఆలోకము — జ్యోతి 4-3-67

20. నాస్మృతంపరామి – తెలుగు స్వతంత్ర 1-6-56

21. తీరాలు – తెలుగు స్వతంత్ర 30-12-55

22. ఓహో! — స్రవంతి 4/58

23. మృత్యుమూర్తి

24. మరుభూములు — స్వతంత్ర 4-7-59

25. విషమోహ

26. హేజవహర్ — భీమ్ సేన్ నిర్మల్ అనువాదం విశ్వజ్యోతి 1964

27. ఎదురు చూచుటలు — జాగృతి 10-3-61

28. New Symbol — The Indian PEN
    Tr. Adapa Rama Krishna Rao

29. చేతనా వర్తము — నవోదయ 15-9-59

30. ధర్మపతాక — జాగృతి

31. మేలు కొలుపు — తెలుగు విద్యార్థి 10/55

32. గుండెల గుసగుస — పిలుపు 29-10-64

33. నీ కన్నులు — 22-10-54

34. ఉత్పాతం — 10-9-54

35. పచ్చ భాస్వరం — 3-9-54

36. వృద్ధోద్యోగం — 27-8-54

37. అగ్నిశృంఖల — తెలుగు స్వతంత్ర 21-5-54

38. భవిష్యత్తు — 14-5-54

39. తమస్విని — పిలుపు 12-11-54

40. నిన్న—నేడు—రేపు — పిలుపు 19-11-54

| | | | |
|---|---|---|---|
| 41. | మృత్యుమూర్తి | జ్యోతి | 1954-55 |
| 42. | తెలుగు తల్లి | పిలుపు | 1-10-54 |
| 43. | నవంబరు ముప్పై | | 3-12-54 |
| 44. | బోనులో సింహం | | 10-12-54 |
| 45. | తనకళ్ళసొంపు | తొలికారు | 1955 |
| 46. | ఏది! ఏ! | తొలికారు | 1955 |
| 47. | పాలంపేట నృత్యమూర్తి | కృష్ణాపత్రిక | 14-:-55 |
| 48. | అన్నా! | | 8-6-56 |
| 49. | ఆనంద హేల | స్రవంతి | 11/56 |
| 50. | ఆవాహన | స్రవంతి | 10/57 |
| 51. | తొలి కిరణము | స్రవంతి | 10/58 |
| 52. | రోచిర్వచి | స్రవంతి | 11/58 |
| 53. | వాసనా పరిష్కృతి | భారతి | 1/55 |
| 54. | జ్యోతిర్ అవతరణము | భారతి | 10/58 |
| 55. | సాహసరి మాన్మథము | భారతి | 4/59 |
| 56. | ద్వివచనము | శోభ | 56-57 |
| 57. | తల్లి అందము | శోభ | 57-58 |
| 58. | చేరెడు కన్నుల నిండా చెదరిపోని వెన్నెల | కాంగ్రెసు | 10/58 |
| 59. | జగద్ధాత్రి | తెలుగు దేశం | |
| 50. | తేజశ్చక్రము | జయంతి | 12/58 |
| 61. | జ్వాలామాల | ఆంధ్రపత్రిక | 11/56 |
| 62. | సర్వాయి పాపన్న | కృష్ణాపత్రిక | 16-6-56 |
| 63. | మధుర వీశధి | తెలుగు దేశం | 14-10-56 |
| 64. | మనిషి | | |
| 65. | మధురాక్కర | | |
| 66. | నాందీ గీతాలు | తెలుగు దేశం | 12/55 |
| 67. | నాందీ గీతాలు | తెలుగు దేశం | 2-2-56 |
| 68. | అవతారిక | ఓరుగల్లు గజానన సర్వస్వం సంచిక | |

| | | | |
|---|---|---|---|
| 69. | జలవేణువు | ప్రపంతి | 1/50 |
| 70. | స్వావిష్కృతి | జయంతి | 7/59 |
| 71. | ఆనంద మోహిని | స్వతంత్ర | 25-5-59 |
| 72. | ఆశావీధి | స్వతంత్ర | 19-10-59 |
| 73. | అవృతి | సవోదయ | 15-11-59 |
| 74. | అమృత మయుడు | పోతన పంచ శతిస్మారిక | 1982 |
| 75. | మళ్ళీదిగి రావాలా! | జాగృతి దీపావళి సంచిక | 1990 |

## పరిశోధనలు - విద్యార్థులు

### (Ph. D.)

| | | | |
|---|---|---|---|
| 1. | ఎ. సురేంద్ర కుమార్ | – | 17, 18 శతాబ్దాల కావ్యాలపై వసుచరిత్ర ప్రభావం |
| 2. | జి. వెంకటరత్నం | – | హంసవింశతి విజ్ఞాన సర్వస్వము |
| 3. | కె. నరసింహాచార్య | – | తిరునామములు–సమగ్ర పరిశీలన |
| 4. | ఎ. భూమయ్య | – | నాయని సుబ్బారావు కృతులు |
| 5. | కె. కాత్యాయని | – | చివరకు మిగిలేది–సామాజిక మనః వివేచన |
| 6. | సి.హెచ్. హైమవతి | – | దాశరథి కవితా పరిశీలన |
| 7. | కె.వి.యన్. రాఘవన్ | – | వేయిపడగలు సమకాలీనత–సార్వజనీనత |
| 8. | సి. హెచ్. శివరావు | – | విశ్వనాథవారి నవలల్లో ప్రాగ్రూప దృక్పథం |
| 9. | వి. జానకి | – | గిడుగు రామమూర్తి విమర్శనాత్మక-పరిశీలన |
| 10. | వి. రంగాచార్య | – | పుట్టపర్తి వారి ఖండకావ్యాలు–శివతాండవం పరిశీలన |

# యం.ఫిల్.

1. ఎ. భూమయ్య – కొరవి గోపరాజు – ఒక విశ్లేషణ
2. పి.హెచ్. శివరావు – పాత్రగ్రూప దృక్పథము – విశ్వనాథవారి పురాణ వైర గ్రంథమాల
3. భాగ్యమ్మ – మాలపల్లి పాత్ర చిత్రణ
4. పి. సుమతీదేవి – నోరి నరసింహశాస్త్రి వాఙ్మయ జీవిత సూచిక
5. డి.వి.ఎన్. చారి – పురాణ వైర గ్రంథమాల–జ్ఞాన విజ్ఞానములు
6. పసం మధుసూదన్ – తెలుగు ఏకాంకికలు
7. లీలాకుమారి – వేంకట పార్వతీశ్వర కవులు వందే మాతరమ్

# అదనపు సమాచారం

1) యస్. రామిరెడ్డి – గోపీచంద్ "చీకటి గదులు" పై యం.ఫిల్.

2) దిదృక్ష – చిటిప్రోలు వెంకటరత్నం గారి వ్యాస సంపుటికి 'సమీక్ష' ముందుమాట

3) సుదర్శన రెడ్డి 'శ్రీ వెంకటేశ్వర చరితం' నకు ముందుమాట

4) జి. బాల శ్రీనివాసమూర్తి – 'తెలుగులో ఆధ్యాత్మిక కావ్యాలు' అను అంశంతో యం.ఫిల్.
శ్రీ యం. వీరభద్రయ్యగారి పర్యవేక్షణలో
(సుధ, శతాంతర, ఋతంభర, పాండిచ్చేరి గీతాలు పన్నెండు)

5) చంద్రశేఖరశాస్త్రి – 'చేతనావర్తకవులు' యం.ఫిల్
శ్రీ జి.వి. సుబ్రహ్మణ్యంగారి ఆధ్వర్యంలో (1986)

6) శ్రీ విష్ణు సహస్రనామ స్తోత్రము – భావసిద్ధి – చైతన్య భారతి
(గోదావరి పుష్కరాల ప్రత్యేక సంచిక 14-8-91)

---

T. Sri Ranga Swamy
H. No. 5-11-114/4, Vidyaranyapuri, Warangal

**Printed Books**

Madhura (Freeverse Poetry) 1984
Shikharam (Freeverse Poetry) 1986
Manasa Sancharare... (Freeverse Poetry) 1988
Vipanchi (Essays) 1986
Warangal Zilla rachayithala Vangmaya Jeevitha Suchika 1987
Kovela Suprasannacharyulu Vangmaya Jeevitha Suchika 1991
A life line Sketch of Devulapalli Ramanuja Rao 1991

**Unprinted Books**

Warangal Nataka Ranga Charitra
Katragadda Kavitha Samalochanam
Kozara to Ekashila (Translation of Yugoslavia Poetry)
Shataka Sahitya Vikasam after 1960's



A Publication of
Srilekha Sahithi, Warangal
Regd. No. 2337/89, Estd. 1977

Rs. 15/- 1991